# నారదభక్తి సూత్రాలు

శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు
శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు

భగవంతుని చేరుకోవటానికి ప్రసిద్ధమైన మార్గాలు మూడు. అవి: కర్మ, జ్ఞాన, భక్తి మార్గాలు. వీటిలో భక్తిమార్గంలో ప్రయాణించటం సర్వసులభంగా ఉంటుందని పెద్దలమాట. ఈ మార్గంలో పయనించేవారికి కఠిననియమ నిబంధనలు లేవు. భక్తిమార్గం ద్వార ముక్తిని చేరుకోవటానికి ప్రత్యేకమైన అర్హతలూ ఏవీ అవసరం లేదు, అందరూ అర్హులే.

భక్తి అంటే మూర్తీభవించిన అమృతం. అలాంటిభక్తి కాయకం, వాచికం, మానసికం అని మూడు విధాలు. త్రికరణ శుద్ధిగా భక్తితో భగవంతుని నమ్మాలి.

నారదులవారు చెప్పిన భక్తిసూత్రాలను తాత్పర్య వివరణలతో సులభంగా అర్థమయ్యే రీతిలో, సకలజనప్రియ రచనగా శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు, శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు గారలు అందించారు.

భక్తికి కావలసినవి విశ్వాసం, శ్రద్ధ భగవంతునిపై భక్తి కలిగి విశ్వాసం ఉన్నవారు ఈ గ్రంథాన్ని తప్పక చదవాలి. అలాంటి వారికి భక్తిమార్గంలో ప్రయాణించి ప్రయోజనం పొందటం సులభతరమౌతుంది.

నారదభక్తిసూత్రాలను చదువుదాం. చదివిద్దాం. సూత్రాలను పాటిద్దాం. తరిద్దాం.

# నారదభక్తి సూత్రములు

రచయితలు

శ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులు

శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

2016

# ముందుమాట

కర్మాది యోగా లెన్నునా వాటికన్నిటికీ భావ ప్రధానమైన భక్తియే మూలాధారం. అధ్యాత్మికపరమైన మనః ప్రవృత్తినే భక్తియని అంటారు. అది కాయికమైనపుడు కర్మయోగమనీ, ప్రాణాయామాది పరమైనపుడు యోగమనీ, బుద్ధి ప్రధానమైనపుడు జ్ఞానయోగమనీ అంటారు. అంతే భేదం.

అయితే కర్మ, జ్ఞాన, యోగ, జప, తప, యజ్ఞయాగాదులలో దేనిచేతా సాధింపలేని దానిని భక్తితో సాధించవచ్చునని భాగవతం చెబుతోంది. భాగవతమైన ఆధ్యాత్మిక ప్రవృత్తియే భాగవతం. అందు ప్రథముడు నారదుడు. అట్టి భక్తిని విశ్లేషించి వ్రాయబడిందే ఈ భక్తి సూత్రములు. స్వానుభవపూర్వకమైన అతని నిత్య ప్రవృత్తికి భాషారూపమైన సూత్రరచన మాత్రమే ఇది. ఈ గ్రంథము లఘుటీకతో కూడియున్నది. ఈ టీకా రచయిత వైష్ణవ పరమ భాగవతోత్తముడు.

శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు, శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు గారలు తగినన్ని విశేషాంశములను సమకూర్చినారు. సాధారణ జిజ్ఞాసువులు, ముముక్షువులు సులభశైలిలో పరిచిత విషయ వివరణలతో చదువదగిన గ్రంథ మిది.

ఈ ఆధ్యాత్మగ్రంథాన్ని దేవస్థానం తమ ధార్మిక ప్రచురణగా వెలువరిస్తున్నది. పాఠకులు ఈ ఆధ్యాత్మగ్రంథాన్ని వినియోగించుకోగలరని మా ఆకాంక్ష.

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

# మనవి

**"ఆర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతా**
**ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః,**
**సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం**
**విముక్తదుఃఖా స్సుఖినో భవంతి".**

నారాయణ శబ్దోచ్చారణ మాత్రమున దుఃఖవిముక్తి నంది పలుబాపముల నుండి ప్రజలు విముక్తులై సుఖింతురు. ముక్తికై విష్ణువు మాత్రమే యాశ్రయణీయు డనుటకు "మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్" అను సూక్తి ధ్రువపరుస్తోంది.

"కలౌ స్మరణా న్ముక్తిః" అను సామెత భక్తలోకమున కామెత. అట్టి భక్తియొక్క స్థూలరూపమును సంగ్రహముగా నైనను సమగ్రముగా తెలిసికొనుట కిందలి "భక్తివివేచన" యుపకరించును. ఇది నారదమహర్షి కృతమగు భక్తి సూత్రములకు లఘు వివరణము. భక్తమాత్రున కత్యం తోపాదేయమగు నిది సర్వమతములవారికిని సమాదరణీయము.

సాహితీ రసికులైన భాగవత శిరోమణులు ఈ "నారదభక్తిసూత్రముల"ను శిరసావహించి ఆనందించి భక్తిమార్గాను యాయులగుదురు గాక.

**కె.టి.యల్. నరసింహాచార్యులు**

# మహర్షి హృదయము

*"మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ"*

భక్తశ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులుగారు రచించిన 'భక్తి వివేచన' యను నీ గ్రంథరత్నము సంపూర్ణముగా పఠించితిని. నారద భక్తిసూత్రముల కిది మృదుమధురశైలిని ద్రాక్షాపాకమున వ్రాయబడిన వివరణము. శాస్త్రీయ సహేతుక సప్రమాణ మీ గ్రంథమనుట స్వభావోక్తి. గ్రంథకర్త ఉపనిషత్తులను; భారత, భాగవత, రామాయణాది గ్రంథస్థ విషయములను; శ్రీమద్భగవద్గీతను సందర్భానుసారముగా నీ భక్తిరచన కన్వయించుటచే నిది పఠితలను బ్రహ్మానందామృతపాన విశేషమత్త చిత్తులనుగా జేయుజాలిన రసగుళికయైనది.

గీతలోని ద్వాదశాధ్యాయమున భక్తున కుండవలసిన అద్వేష్టృ త్వాదులగుముప్పదియైదు లక్షణములు వివరింపబడినవి. శ్రీమద్భగవద్గీత యందు భక్తి నవవిధములుగా వర్ణింపబడినది. కాని నారదు డిందు భక్తిని గుణమాహాత్మ్యాసక్తి మొదలగు ఏకాదశ విధములుగ నిర్ణయించుట గమనార్హము. శ్రీకృష్ణపరమాత్మ గీతలో ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అను చతుర్విధ భక్తులను పేర్కొన్నాడు. జ్ఞానికిని తనకును భేదము లేదని; అట్టి జ్ఞానియే అనన్యభక్తుడని గూడ నాయన ప్రవచించిరి.

భగవంతుని గూర్చిన యపరిచ్ఛిన్న ప్రేమయే యనన్యభక్తి. ఆయ ననన్యభక్తుడు మాత్రమే. తన దేహేంద్రియప్రాణ మనోబుద్ధులతో సర్వత్ర పరమేశ్వరుని సందర్శించుచు సర్వసమర్పణ రూపభక్తితో తన జీవితమాతనికే యంకితము చేయును. అప్పుడు మాత్రమే మానవసేవయే మాధవసేవ యగును. ఇట్టి భక్తుడు భగవంతుని కొరకే ఆవిధముగా సేవించును. అది నిస్వార్థమయినది; అమృత స్వరూపమయినది; శాంత్యానందరూపమయినది.

ఆత్మరతికి భంగము కల్గింపకుండునదే భక్తి యని శాండిల్య మహర్షి వచనము. ఆత్మయందు మనస్సు లయమయిన తర్వాత చింతింపవలసిన దేమియును లేదని శ్రీకృష్ణవచనము గదా! ఇప్పుడు మనస్సు ఆత్మసంస్థ మగుట ఎట్లు అని ప్రశ్న. దీనికి అనుభవము, విచారణ మిగుల నవసరము. అనాత్మయందు మనస్సు నుంచుట వలన కల్గిన కష్టనష్టముల నెరిగిన తర్వాత ఆత్మయందు మనస్సును సంపూర్ణముగ నుంచుటకు సాధకుడు యత్నించును. ఈ దశలో 'మనమే రామ్, ముఖ్‌మే నామ్, హాత్‌మే కామ్' అను మూడు విషయములను జ్ఞాపకముంచుకొనవలెను. ఇదియే త్రికరణశుద్ధి. మదిలో రామతత్త్వచింతనము; వాక్కుతో రామ నామ సంకీర్తనము; చేతితో పని చేయునపుడు రాము నాదర్శముగ నుంచుకొనుట ముఖ్యము. ఈ విధముగా నిర్గుణారాధనము చేసినను మనోబుద్ధులు పరమాత్మ యందు లగ్నమగుట యత్యంతావశ్యకము.

పరాభక్తి భావశుద్ధి ప్రదానము. భావశుద్ధియే జ్ఞానశుద్ధి. అనుభవమే దానిరూపము. అట్టి యనన్యభక్తితో నిత్యనిరంతరముగా తనను పర్యుపాసన చేయువారి యోగక్షేమములను తానే వహింతునని పరమేశ్వరుడు నొక్కి వక్కాణించెను గదా! కాన నీ సాధన సంపూర్ణముగా హస్తగతమైనచో సిద్ధి తనంతట నదియే కల్గుననుటలో సందియమునకు తావు లేదు.

**శ్లో॥ "అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (గీత. 9-22)**

ఈ విధముగా నిత్యనిరంతర భగవచ్చింతన యొక్కయు; స్మరణ భజనాదుల యొక్కయు ప్రాముఖ్యమును ప్రకటించుచున్న ఈ భక్తి వివేచనను హరిభక్తులందరును పఠించి ఆత్మతత్త్వజ్ఞులై తరింతురు గాక!

1-5-74 ఆచార్య యస్.వి.యల్. నరసింహము.

# ధ్యానము

భక్తాపాయభుజంగ గారుడమణి స్త్రైలోక్యరక్షామణిః
గోపీలోచన చాతకాంబుదమణిః సౌందర్య ముద్రామణిః ।
యః కాంతామణి రుక్మిణీ ఘనకుచ ద్వంద్వైకభూషామణిః
శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నోగోపాలచూడామణిః ॥

నాన్యాస్పృహా రఘుపతే! హృదయే - స్మదీయే
సత్యం వదామి చ భవా నఖిలాంతరాత్మా ।
భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ! నిర్భరాం మే
కామాదిదోషరహితం కురు మానసం చ ॥

నధర్మనిష్ఠోస్మి న చాత్మవేదీ
న భక్తిమాం స్త్వచ్చరణారవిందే ।
అకించనో - నన్యగతి శ్శరణ్య
స్త్వత్పాదమూలం శరణం ప్రపద్యే ॥

నగు మొగమున్ సుమధ్యమును నల్లని మేనును లచ్చి కాటప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ మదే
భ గతియు నీలవేణియుఁ గృపారస దృష్టియుఁ గల్గు వెన్నుఁడి
మ్మెగఁ బొడసూపు గాతఁ గనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్.

శ్రీయను మించుమిం చొలయ సేవకచాతక లోకమోద సం
ధాయకుఁడై యుదారకరుణారసవృష్టి దురాపతాపముల్
వాయఁగఁజేయుచున్ సకలవాంఛితసస్యము లుల్లసిల్లఁగాఁ
జేయుడు వేంకటాద్రినివసించు ఘనుండిడు మాకు భద్రముల్.

– ప్రసిద్ధ కవులు

# నారద భక్తి సూత్రములు

శ్లో॥ శ్రీరంగార్య కృపాపాత్రం రామానుజ పదాశ్రయమ్ ।
శ్రీ నృసింహార్యసత్పుత్రం జగన్నాథగురుం భజే ॥

శ్లో॥ వందే వందారువాత్సల్యే స్వాచార్యపదపంకజే ।
యత్సేవనా దీదృశో – యం జాతో విద్యావిశారదః ॥

శ్లో॥ శ్రీ వేంకటతాతార్యోవైయాకరణ కేసరీ ।
అస్మద్దేశికవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

శ్లో॥ అనన్యలభ్యయా భక్త్యాయో హరిధ్యానభాగ్యతః ।
చకార భక్తి సూత్రాణి తం వందే నారదం ఋషిమ్ ॥

శ్లో॥ తస్యైవ కృపయాద్యాహం భక్తి సూత్ర వివేచనామ్ ।
కరోమి భక్తలోకస్య రక్తయే మమ ముక్తయే ॥

# విషయ సూచిక

# ప్రథమాధ్యాయము

## (భక్తినిరుక్తి)

**సూత్రము 1: అథా - తో భక్తిం వ్యాఖ్యాస్యామః**

**తాత్పర్యము :** ఇకనిప్పుడు భగవంతుని జేరుటకు జీవులనుష్ఠింపదగిన భక్తి స్వరూపము వివరించుచున్నాము.

**వివరణము :** భగవంతుని చేరుటకు కర్మ, జ్ఞాన, భక్తి మార్గములు మూడును శాస్త్రసిద్ధములు. మిగిలిన వానికంటె భక్తిమార్గము సర్వసులభము. దీని కితర మార్గములవలె నెట్టి కఠిన నియమ నిబంధనలును లేవు. భక్తి ప్రయాణముచే మార్గముక్తి బడయుట కెల్లరు నర్హులే. భగవదనుగ్రహమందు పూర్ణవిశ్వాసము గలవారెల్లరును దీనికి యోగ్యులు. "విశ్వాసః ఫలదాయకః" (నమ్మకము తప్పక సత్ఫలము నిచ్చును) అని గదా అభియుక్తోక్తి!

అవగ్రహమునకు బదులుగా శ్లోకములలో ఽ వాడబడినది.

ఈ సందర్భమున శ్రీకృష్ణ భగవానుని ఈ సూక్తి గదా మననీయము-

**శ్లో ॥ "అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।**
**సాధురేవస మంతవ్యః; సమ్యగ్వ్యవసితో హి సః ॥"**

**(గీత 9-30)**

(ఎంత దురాచార పరాయణుడైనను గానిమ్ము. అనన్య సాధ్యమయిన భక్తితో నన్ను సేవించునేని యట్టివాడు సత్పురుషుడే. భగవంతునిపై వాని యధ్యవసాయమంత దృఢమైనది గదా మరి)

పూర్వమం దనేకమంది భక్తి తత్త్వవేత్తలు పల్కిన పల్కులనే నేను వివరించి యనువదించుచున్నాను గాని క్రొత్త మార్గమేదియు చూపుటకు

పూనుకొనలేదని "వ్యాఖ్యాస్యామః" అనుటలో నారదమహర్షి హృదయము "మహా జనో యేన గతః స పంథాః" (మహాత్ములు పోయినదారి మాత్రమే మంచిది) అన్నారు గాన పాఠకసోదరులారా! రండు, మనము సైత మీ మహర్షి ప్రోక్త మార్గముననే పయనించి పరమ పద సోపానముల నన్వేషించుటలో కృతార్థుల మగుదుము;

**సూ 2 : సాత్వస్మిన్ పరమప్రేమ రూపా**

**తా** : భగవంతుని యెడ పరమప్రేమయే భక్తి.

**వి** : స్త్రీ పురుషుల పరస్పరానురాగము ప్రేమయనుట సామాన్య విషయము. కాని భగవత్ప్రేమ యట్టిది గాదు. కాననే యది విలక్షణము. అది నిర్వ్యాజము, నిశ్చలము నని 'పరమ' యను విశేషణము సూచించుచున్నది. అహంకారమునకు నిందు తావులేదు. అనన్య చిత్తముతో భగవంతుని ప్రేమించువాడు మరెవ్వరిని ప్రేమింపలేడు. సామాన్యప్రేమ స్వార్థమయము. భక్తుడు తన్ను తాను మరచి కేవలము బ్రహ్మచింతనముననే మగ్నుడయి యుండును. పరబ్రహ్మానుభవముకంటె నతనికి మరొక దృష్టియే యుండదు.

ప్రతిఫలము నపేక్షింపకుండ భగవంతునిపై నేకాగ్రప్రేమను ప్రవహింపజేయుటయే భక్తియని ఫలితార్థము. ఏకాగ్రత యననిట్టిది–

**సూక్తము: "ప్రణవో ధను శ్శరో హ్యాత్మాబ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్ ॥"**

**(4-4 ముండకోపనిషత్తు)**

(ఓంకారము ధనుస్సు, ఆత్మశరము. పరబ్రహ్మ యాబాణమునకు లక్ష్యము. జాగరూకులమై లక్ష్యమును భేదింప (ఉపాసింప) వలెను. శరమువలె తన్మయులమైనపుడే యది సాధ్యము)

**సూ 3 : అమృత స్వరూపా చ.**

**తా** : ఆ భక్తి మూర్తీభవించిన యమృతమే.

**వి** : రెండవ సూత్రమున భక్తి 'పరమ ప్రేమరూప' మని పల్కి ఇందు అమృత స్వరూపమే యది యని నిర్వచించుటలో కవి హృదయము గమనింపదగును. 'స్వరూప' యను పదముచే దాని యాంతరిక సహజ స్వభావమును తేటతెల్లమగును.

నాశము మార్పు లేని స్థితిని వర్ణించునపుడు మాత్రమే యమృత శబ్దము వాడుదురు. దేవతల యాహారమును గూడ 'అమృత' పదము తెలుపును గదా! ఆ సుధను పానము చేసినవారికి చావు పుట్టుకలు లేనట్లే బ్రహ్మానందామృతమును ద్రావినవారికి గూడ సుఖదుఃఖాదులు గలుగవని సూచించుటకు మహర్షి ఇచట 'అమృత' శబ్ద ముపయోగించెను. ఆహారమగు అమృతమును త్రావిన కొలదియు నది క్షీణించుట జరుగవచ్చును. కాని ఈ భక్తిసుధ మాత్రము సేవించిన కొలది దినదినాభివృద్ధిని గాంచుచునే యుండును.

ఇది బ్రహ్మవిద్య కాన, విద్యకు సహజమగు స్వరూప స్వభావములు దీనికి సైతము వర్తించును. నిజమునకు బ్రహ్మవిద్యయే విద్యగాని ఇతరవిద్య అవిద్యయే గదా!

అట్టి యమృతము గూడ కడుపు పట్టినంత మాత్రమే గ్రోలనగును. కాని భక్తిసుధ తీరు మాత్రము వేరు. భక్తిని అమృతమన్నట్లే భగవంతుని సైత మమృత మన్నారొకరు. అంతే గాదు, ఇంకొక భక్తరత్నము మఱొక యడుగు ముందుకువేసి ఆ భగవంతుని అతృప్తామృత మని పేర్కొన్నాడు. ఔను మరి, ఎంత గ్రోలినను తనివి తీరనిది గదా యా భగవదమృతము; త్రావిన కొలది

మరింత త్రావవలపు కల్గించుటయే దీని ప్రత్యేకత. ఈ భక్తి రసమునకు శృంగారాది నవరసముల కంటె విశిష్టస్థానము గలదు. ఈ భక్తి యభినవరసము సుడీ! ఇట్టి భక్తి రసామృత సింధువు గదా పరతత్త్వము!

నీలఘనశ్యాముడగు నా గోపాల చూడామణి వలెనే ఈ భక్తిరత్నము గూడ నుజ్జ్వల నీలమణి యని పేరు గాంచినట్టిది. గోపికా? ఘనకుచ ద్వంద్వైక భూషామణి యగు నా దేవశిఖామణికి గల లక్షణము లన్నియును ఈ భక్తిమణికి గూడ గలవన్న విప్రతిపత్తి యుండదు. ఆ భక్తాపాయ భుజంగ గారుడమణికి గల శరణాగత రక్షాదీక్ష యెట్టిది!

**ప ॥ నాకు మేలుఁ గోరు నా భక్తుఁడగువాఁడు**
**భక్తజనుల కేన పరమ గతియు;**
**భక్తుఁడెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట**
**గోవు వెంటఁ దగులు గోడెభంగి, (అంబరీషోపాఖ్యానము-భాగ)**

నే నేమైనను నాకు లెక్కలేదు గాని నీవే దిక్కని నమ్మిన దీనులను రక్షింపకుండుట మాత్రము నా తరము గాదు. గోవు వెంట పోవు కోడెదూడ వంటిది సుడీ నా యారాట మని యా గోపాల చూడామణి పై పద్దెమున నొక్కి వక్కాణించినాడు గదా!

ప్రసక్తానుప్రసక్తముగా పెరిగిన ఈ చర్చనింతటితో నాపుదమా!

**సూ 4 : యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధోభవతి, అమృతో భవతి, తృప్తో భవతి**

**తా** : ఈ భక్తిసుధను త్రావిన పురుషుడు సిద్ధుడగును; అమృతుడగును; సంతృప్తుడగును.

**వి** : అట్టి పరాభక్తి స్వరూపము నిందు మహర్షి వివరించుచున్నాడు- ఈ యమృతత్వము మానవుడు కోరినంతమాత్రమున లభింపదు.

నిర్హేతుక జాయమాన భగవత్కటాక్షమొక్కటియే దానికి మూలమనదగును. చిత్తగింపు డీ శ్లోకము –

**శ్లో ॥ "జాయమానం హి పురుషం యం పశ్యే న్మధుసూదనః ।**
**సాత్త్వికస్సహి విజ్ఞేయస్సవై మోక్షార్థ చింతకః ॥"**

(మధుసూదనుని దృష్టి జన్మకాలమం దే జీవిపైన ప్రసరించునో వాడే సాత్త్వికుడు. వాడే మోక్షార్థచింతకుడు) ఈ భావమును సూత్రమందలి 'లబ్ధ్వా' యను పదము సూచించును. ముండకోపనిషత్తు గూడ నీ యంశమునే బలపరచుచున్నది గదా!

**సూక్తము : 'నా యమత్మా ప్రవచనేన లభ్యో**
**న మేధయాన బహునా శ్రుతేన ।**
**యమేవైషవృణుతే తేన లభ్య**
**స్తస్యైష ఆత్మా వివృణుతే తమాం స్వాం ॥" (6-3)**

ఈ యాత్మజ్ఞానము ప్రవచముచేగాని, మేధచేగాని, బహుశాస్త్ర జ్ఞానముచే గాని లభ్యము గాదు. భగవంతు డే పురుషుని తరింపజేయు గోరునో వానికి మాత్రమే యది యబ్బును. అట్టివానికే భగవంతుడు తన దివ్యమంగళ విగ్రహముయొక్క స్వరూపస్వభావముల నెరుకపరచును.

'పుమాన్' అనగా పురుషుడు, మానవుడని భావము. పశుపక్ష్యాది జంతువులకు గూడ భక్తిమార్గము లభ్యమే యయ్యును మానవుల కది యత్యంత సులభమని దీనిచే తెలియుచున్నది.ట

ఇట్టి భక్త్యమృతమును పానము చేసినవాడు తానును యమృతమే మయిపోవు ననుటలో నచ్చెరువేమి యుండును?

భగవంతుడు తనకంటెను తన యాత్మీయులకంటెను తన్ను త్రికరణశుద్ధిగా నమ్మిన భక్తులపైననే మక్కువ నిల్పునని, యట్టివారికై తన

సర్వస్వము త్యాగము చేయుటకు వెనుదీయదని మనకు గజేంద్రుని గాథ చాటుట లేదా! ఆ కరివరదుని యార్తి ఇట్టిది గదా!

**మ॥ అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా**
**పల మందార వనాంతరామృతసరః ప్రాంతేందు కాంతో పలో**
**త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి**
**హ్వలనాగేంద్రముఁ పాహిఁ పాహి యనఁ గుయ్యాలించి**
**సంరంభియై". (భాగ. 8-95)**

**మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేఁదోయి సంధింపఁడే**
**పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డా కర్ణికాం**
**తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాద ప్రోత్థిత శ్రీకుచో**
**పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.**

**మ॥ తన వేంచేయుపథంబు పేర్కొనఁ డనాథ స్త్రీ జనాలాపముల్**
**వినెనో? మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ రీద ప్రపంచంబులన్!**
**దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో! భక్తులం**
**గని చక్రాయుధుఁడేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్?**
**(భాగవతము 8-100)**

భక్తికి ముక్తికి జాతి లింగవయోభేదము లేదని మహర్షి పల్కిన పసిడిపలుకు భక్తిమత ప్రచారకు లెల్లరు నంగీకరించి నట్టిదే;

**సూ 5 : యత్ప్రాప్య న కించి ద్వాంఛతి, నశోచతి, నద్వేష్టి,**
**నరమతే నోత్సాహీ భవతి.**

**తా** : ఆ యమృతము పొందినవాడు తరువాత మరి దేనిని కోరడు. ఎట్టి దుఃఖములు పైబడినను బాధపడడు. దేనిని ద్వేషింపడు. దేనికి ఆనందింపడు. వేయేల! ఆత్మహితమును సైతము కోరడు. ఈ సూత్రమున స్థితప్రజ్ఞుని లక్షణములు వివరింపబడినవి –

**శ్లో॥ "దుఃఖే ష్వనుద్విగ్న మనాః సుఖేషు విగతస్పృహః,**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మని రుచ్యతే," (గీత : 2-56)**

(దుఃఖకాలమున వికల మనస్కుడు కానివాడును, సుఖములు పైకొన్నను పొంగిపోనివాడును, రాగద్వేషాదిరహితుడు నయిన ముని మాత్రమే స్థితప్రజ్ఞుడు).

అమృతస్వరూపుడగు భక్తునకు కోరిక యనునదే యుండరాదని ఫలితార్థము.

**సూ 6 : యద్ జ్ఞాత్వా మత్తో భవతి స్తబ్ధో భవతి ఆత్మారామో భవతి**

**తా** : భగవత్ప్రేమయను అమృతముయొక్క తత్త్వము తెలిసినవాడు మత్తుడు. స్తబ్ధుడు, ఆత్మారాముడు నై యుండును.

**వి** : పరమభక్తుడయినవాడు భగవంతునికి సర్వాత్మసమర్పణము చేయును.

**శ్లో ॥ "కాయేన వాచా మనసేంద్రియైర్వా**
**బుధ్యాఽ ఽ త్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।,**
**కరోమి యద్యత్ సకలం; పరస్మై**
**నారాయణా యేతి సమర్పయామి॥"**

(శరీరముచేతగాని, వాక్కుచేతగాని, మనస్సుచేతగాని, ఇతరేంద్రియములచేతగాని, బుద్ధిపూర్వకముగాగాని, ఆత్మప్రేరణచేతగాని నే నే సత్కర్మ చేయుదునో దాని ఫలితమంతయు శ్రీమన్నారాయణునకే ధారవోయుదును)

భక్తుడొకప్పుడు బాహ్యదృష్టికి లౌకికునివలె గనిపించినను అంతర్దృష్టితో నాత డొప్పారును. నిస్తరంగ నీరధివలె నాతని మన స్సెప్పుడును కల్లోల రహితముగనే యుండును.

ప్రీతిపూర్వకముగా తనను ధ్యానించువానిని భగవంతుడు జ్ఞానమార్గము ద్వారా తన సమీపమునకు చేర్చుకొనునని సాక్షాత్తుగ గీతాచార్యుడే వాకొనియున్నాడు గదా –

**శ్లో ॥ "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥"**
**(గీత. 10 : 10)**

మత్తుడనగునన్నపుడు ప్రహ్లాదుని ఈ సూక్తి స్ఫురించుట లేదా?

**ప॥ "అంబుజోదర దివ్యపాదారవింద**
**చింతనామృత పాన విశేషమత్త**
**చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు**
**వినుత గుణశీల! మాటలు వేయునేల?"**
**ప్రహ్లాద చరిత్ర (భాగ. : 7–150)**

స్తబ్ధుడనగా సుఖదుఃఖములకు లొంగక కొయ్యబారినవాడు. ఆత్మారాముడనగా భగవదేకలగ్న బుద్ధిగలవాడు.

**సూ 7 : సా న కామయమానా నిరోధరూప త్వాత్.**

**తా** : పరమ ప్రేమరూపమయిన యా భక్తి లౌకిక వస్తువులను ప్రేమించునట్టి కామము గాదు; పైగా దానిని నిరోధించునట్టిది.

**వి** : ఇందు కామమునకు భక్తికి భేదము తెలుపబడినది. కామమున చిక్కుకొన్న చిత్తము సదా యింద్రియాధీనమయి యుండును. మరి భక్తిలగ్నమగు చిత్తమిందుకు సరిగా వ్యతిరేకము. రెండు స్థితులు నుత్తర దక్షిణ ధ్రువములను బోలినట్టివి.

కఠోపనిషత్తు కాముకునకు భక్తునకు మధ్యగల యంతరము నెంత సూక్ష్మముగా స్పష్టీకరించినది.

**సూ : "యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్క స్సదాఽ శుచిః ।**
**న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి॥" (1-3-7)**

ఆత్మజ్ఞానవిరహితుడగు కాముకుడు మనోనిగ్రహశూన్యుడై అశుచి యైనందున అక్షర మగు పరమాత్మను పొందలేక జనన మరణ రూప సంసార చక్రమున పరిభ్రమించుచుండును.

**సూ : "యస్తువిజ్ఞానవా న్భవతి సమనస్క స్సదాశుచిః ।**
**సతు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే॥"**
**(కఠో 1-3-8)**

ఆత్మజ్ఞాన సంపన్నుడగు పరాభక్తుడన్నో మనో నిగ్రహవంతుడై సదా శుచియైనందున పునరావృత్తి రహితమగు పరమపదము నందును.

**సూ 8 : నిరోధస్తు లోక వేద వ్యాపార న్యాసః ॥**

**తా** : లౌకికవైదికము లయిన సర్వకర్మలను భగవదర్పితము చేయుటయే నిరోధము.

**వి** : నిరోధమున అణచిపెట్టుట యని కొందరర్థము చెప్పుదురు. కాని యది సరిగాదు. భగవదర్పణబుద్ధితో కార్యము లన్నింటినీ సన్యసించుటయే విరోధము. సన్యాస శబ్దమునకు త్యాగమే గాక సమర్పణ మని గూడ యర్థము ప్రసిద్ధము. కర్మలు చేయుచు తత్ఫలము భగవంతునికి ధారపోయుటయే సన్యాసమని భక్తితత్త్వవేత్తలు ముక్తకంఠులై వక్కాణించినారు. గ్రంథ విస్తరభీతిచే నీ విషయచర్చ నింతటితో ముగింతును.

**సూ 9 : తస్మి న్ననన్యతా తద్విరోధి షూదాసీనతా చ.**

**తా** : భగవదనన్యు డగుట, భగవద్విరోధులయెడ తటస్థభావమును వహించుటయునే న్యాసము.

వి : సామాన్యుల మనస్సు సముద్రము వంటిది. అందు వివధములగు భావతరంగము లుత్పన్నమయి లయించుచుండును. పరాభక్తుని యం దాభావము లన్నియు నొకటిగా రూపొంది భగవత్ప్రేమయందే లయించును. ఇతర భావములు లయమందుటచే భగవదిచ్ఛయే భక్తుని యిచ్ఛ యగును.

**సూ 10 : అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా**

**తా** : ఇతరమయిన యధారముల త్యాగమే యనన్యత.

**వి** : దైవసాక్షాత్కారమునకు ముందు అహంకారమే ప్రధానమై ఇతర భావములను నడపించును. తర్వాత యహంకారము నశించి-

**శ్లో ॥ "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మయయా॥**
**(గీత. 18-61)**

(ఈశ్వరుడు సర్వులయొక్క హృదయము నధిష్ఠించి యుండి ఆయా ప్రాణులను మాయచే భ్రమలపాలు చేయుచుండును) అని శ్రీకృష్ణపరమాత్మ యన్నట్లు సర్వ కార్యకారణ జాతమునకును దైవమే కర్తయను భావము రూఢమగును.

**సూ 11 : లోక వేదేషు తదనుకూలాచరణం తద్విరోధి షూదాసీనతా.**

**తా** : లౌకిక వైదిక కర్మలలో భగవదనుకూలమైనవానినే యాత డాచరించును. వ్యతిరేకమైన వానియం దుదాసీనుడగును.

**వి** : భగవత్ప్రేమకు విఘ్నము కల్గించు పనులు వదలుటచే వేరు గతిలేక వాని శక్తి యేకాగ్రభక్తికే సాయపడును. శ్రీకృష్ణుడు చెప్పిన లోకసంగ్రహ కార్యము లన్నియు నీ విధముగా నాతడాచరించును. ఇట్టి భక్తుని కన్నులు తెరిపించుటకే కదా భగవానుని యీ గీతోక్తి :

**శ్లో ॥ "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।**
**నా నవాప్త మవాప్తవ్యం వర్తనవ చ కర్మణి॥" (గీత. 3-22)**

(పార్థా, నాకు కర్తవ్య మనునది లేదు. నాకు పొందదగినది యంతకంటె లేదు. కాని నేను సైతము లోకసంరక్షణార్థము సత్కర్మ చేయుచుండుట నీవు చూచుచున్నావు గదా)

**సూ 12 : భవతు, నిశ్చయ దార్ఢ్యాం దూర్ధ్వం శాస్త్రరక్షణమ్ ॥**

**తా** : నిశ్చయ దార్ఢ్యమునకు మించినది శాస్త్ర రక్షణము.

**వి** : మహర్షుల యాధ్యాత్మికమగు అనుభూతుల సమూహమే శాస్త్రము. శాస్త్ర వచనములు త్రికాలసత్యము లనువిషయము మన కనుష్ఠాన పూర్వకముగ కన్నులకు గట్టి నమ్మకము కల్గించు దక్షులు నేడు మిక్కిలి యవసరము. వారే యవతార పురుషులు. ఈ విషయము గీతోక్తమే -

**శ్లో ॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥**
**(గీత. 4-7)**

("స్వయం తీర్ణః పరాంస్తారయతి" (తాను తరించి యితరుల తరింపజేయవలెను) అను సూక్తి ననుసరించి తాను శాస్త్రసిద్ధ విషయముల నాచరించి యితరులచే దాని నాచరింపజేయుటయే పరాభక్తులకు కర్తవ్యము)

శ్రీ రామకృష్ణ పరమహంసాది మహాపురుషుల జీవితాచరణము దీనినే దృఢపరచునట్టిది గదా!

**సూ 13 : అన్యథా పావిత్ర్య శంకయా.**

**తా** : తాను నమ్మి ఇతరులకు బోధించునట్టి విషయములు తా నాచరింపనిచో నట్టిగురువు పవిత్రతను గూర్చి ప్రజలు శంకింప నవకాశముండును గదా.

**వి** : తా ననుభవ పూర్వకముగ నమ్మిన పరమార్థమందు గట్టి నిర్ణయము గలుగకముందే తమ బుద్ధికి తోచినట్లు ఎవరైన ప్రవర్తించినచో వారు భయభ్రష్టులగుటయే గాక తమ్ము నమ్మినవారిని గూడ చెడగొట్టెదరు.

ధర్మగతి సూక్ష్మమనియు కాననే ధర్మాచార్యుడెంతో జాగ్రతతో ముందడుగు వేసి మార్గదర్శకుడు కావలెననియు ఫలితార్థము.

**సూ 14 : లోకోఽపి తావదేవ; భోజనాదివ్యాపార స్త్వాశరీర ధారణావధి।**

**తా** : లౌకికాచారదులిట్టివే. భోజనాది వ్యాపారములన్నియు శరీరధారణ కొరకు మాత్రమే.

**వి** : లౌకికాచారములు దేశకాలపాత్రములను బట్టి మారుచుండును. కాన సిద్ధుడైన వాని కెట్టి నిర్బంధమును నుండదు. భగవదిచ్ఛాధీనుడై యాతడెల్ల కార్యములందును ప్రవర్తించును. అట్టి వాని యాచరణ శాస్త్ర వ్యతిరేకముగనున్నట్లు మనకు కన్పించినను నది సత్యేతరమే యగును. లోకము వేరు; శాస్త్రము వేరు. భోజనాది వ్యాపారములు జీవికి సహజమగు నాహార నిద్రాదులు. భగవత్సేవకై శరీరమునకు వలయునంత దార్ఢ్య సంపాదనకై యత్నించుట దోషము కాకపోగా యావశ్యకమే యగును. భక్తుని దేహము భగవన్నిలయము : దానిని శుచిగా నారోగ్యముగా నుంచుట సైతము వాని ముఖ్య కర్తవ్యమే.

**సూ 15 : తల్లక్షణాది వాచ్యంతే నానామతభేదాత్।**

**తా** : భక్తుని లక్షణములు మతభేదమును బట్టి వివిధముగా చెప్పబడినవి.

**వి** : భక్తుని తత్త్వమనుభవగమ్యము మాత్రమే. అది యూహాతీతము. వాచామగోచరము. ఊహయన్న మాటలోనే సమగ్రత లేదు గదా!

భక్తిస్వరూప వివరణ యందు మహర్షులలో సైతము మతభేదము గలదు. కాని స్వభావము మాత్రమొక్కటియే. దాని స్వభావము స్థూలముగ నిట్లు సూత్రీకరింపనగును.

భగవంతుని గూర్చిన ప్రేమయే భక్తి దేవునియెడ ననన్యాను రాగమే భక్తి. తైలధారవలె నవిచ్ఛిన్నమై ఈశ్వరాభిముఖ మగుచు నూర్ధ్వముఖముగా ప్రవహించు భావధారయే భక్తి.

**సూ 16 : పూజాది ష్వనురాగ ఇతి పారాశర్యః ।**

**తా** : భగవత్ పూజాదులందు ప్రీతియే భక్తియని వ్యాసుని మతము.

**వి** : కాయిక వాచిక మానసిక భక్తులలో కాయికభక్తి యిది. కాయిక భక్తి మొదటిమెట్టని కొందరందురు. అది నిజమే యయినను దీనికి తేలికదన మాపాదింప తగదు. భగవత్సాక్షాత్కారానంతరము దీనిచే పూజాదులం దతిశయశ్రద్ధ యుదయించును.

కాయికపూజ యెట్లు చేయనగునో శ్రీ కులశేఖరాళ్వారుల యీ ముకుందమాలాశ్లోకము చాటుచున్నది గదా!

**శ్లో ॥** **"జిహ్వే కీర్తయ కేశవం, మురరిపుం**
**చేతో భజ, శ్రీధరం;**
**పాణిద్వన్ద్వ! సమర్చయాచ్యుతకథాః;**
**శ్రోత్రద్వయ! త్వం శృణు ।**
**కృష్ణం లోకయ లోచనద్వయ! హరే**
**ర్గచ్ఛాఙ్ఘ్రియుగ్మాలయం;**
**జిఘ్ర, ఘ్రాణ! ముకున్ద పాద తులసీం**
**మూర్ధన్న మాధోక్షజమ్ ॥"**

**ప ॥** **హరి భజియించు హస్తములు హస్తము, లచ్యుతుఁగోరి మ్రొక్కు త చ్ఛిరము శిరంబు; చక్రధరుఁజేరిన చిత్తము చిత్త, మిందిరా**

**వరుఁగను దృష్టి, దృష్టి మురవైరి నుతించిన వాణి వాణి య**
**క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్!**

**(భాగవతము)**

**(కుచేలోపాఖ్యానము - భాగ - 10 ఉ.భా.-963)**

మీరాబాయి, చైతన్య మహాప్రభువు మొదలగు భక్తచూడామణులీ భక్తిపారవశ్యము చేతనే గదా యొడలు మరచి నృత్యాదులతో కాలక్షేపము చేసి ముక్తి నందగలిగినారు.

**సూ 17 : కథాది ష్వితి గర్గః ।**

**తా** : భగవంతుని కథాదులు వినుట భక్తి యని గర్గుడనెను.

**వి** : ఇదియే వాచికభక్తి, నామజపము, సంకీర్తనము, పురాణపఠనము, హరికథాగానము, స్తోత్రాది రచనము మొదలగునవన్నియు నీ తెగకు చెందును.

**శ్లో ॥ "మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।**
**కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చరమంతి చ ॥"**

**(గీత 10-9)**

(నాయందే మనస్సు నిల్పి, నాకే జీవితమర్పించి, పరస్పరము భక్తిని ప్రబోధించుకొనుచు, నన్ను గూర్చిన పలుకులతో కాము పుచ్చుచు సంతోషముతో నా భక్తులానంద పరవశు లగుచుందురు సుమా?)

**సూ 18 : ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః ।**

**తా** : ఆత్మరతికి భంగము కల్గింపకుండునదే భక్తి యని శాండిల్య మహర్షి వచించెను.

**వి** : ఆత్మానందము కల్గింపని భక్తికి ప్రయోజనము శూన్యము. కేవలము కప్పవలె బెకబెకలాడుట చాలదని, నామముతోపాటు

రూపము గూడ స్మరించినపుడు ఆత్మానందము లభించునని సారాంశము.

**సూ 19 : నారదస్తు తదర్పి తాఖిలాచారతా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి (చ) ।**

**తా** : సర్వాచరణములను భగవంతునకే యర్పించుటయు, ఆ యీశ్వరుడొకవేళ మరపునకు వచ్చినచో వికలు డగుటయు భక్తియని నారదమహర్షి మతము.

**వి** : సర్వమును భగవదర్పితము చేయుటయు తద్వియోగము సహింపకుండుటయు మాత్రమే భక్తి.

**సూ 20 : అస్త్యేవమేవమ్**

**తా** : ఇట్టి భక్తులు గలరా యని శంకింపకుడు.

**సూ 21 : యథా వ్రజగోపికానామ్**

**తా** : బృందావన మందలి గోపికలే యిందుకు దృష్టాంతము గదా!

**వి** : విద్యాగంధశూన్యలగు అనాగరిక గోపికాస్త్రీలు పరభక్తురాండ్రని భక్తిలోక మేకగ్రీవముగా నంగీకరించె గదా!

శరద్రాత్రిని వేణుగానము చేయు శ్రీకృష్ణుని సన్నిధికి వెళ్ళిన గోపికలు ఆత్మసమర్పణము చేసిన తీరెంత స్పృహణీయము : వారేమని పల్కిరి?

**ప ॥ సిరికి నుదార చిహ్నములు సేయు భవచ్చరణార విందముల్**
**సరసిజనేత్ర! మా తపముసంపదఁజేరితి మెట్ట కేలకున్,**
**మరలఁగ లేము మా మగల మాటల నొల్లము; పద్మగంధముల్**
**మరగిన తేఁటు లన్యకుసుమంబుల చెంతనుజేర నేర్చునే!**

**(భా -10-పూ.ఖా.-991)**

దాని కా సర్వేశ్వరుడు సర్వభోక్తయగు వ్రజకిశోరుని సమాధానమెంత భావగర్భితము!

**ప ॥ పాయని గేహశృంఖలలఁబాసి నిరంతర మత్పతితత్వముం**
**జేయుచునున్న మీకుఁ బ్రతి సేయ యుగంబులనైన నేర, నన్**
**బాయకకొల్చు మానసముఁబ్రత్యుపకారముగాఁదలంచి నా**
**పాయుట దప్పుగాఁ గొనక భామినులార కృపన్ శమింపరే!**
**(10.పూ.భాగ.1080)**

అట్టి యానాటి గోపికాస్త్రీల భక్తియే, నేటికిని జయదేవాది మహాకవుల మధుర గీతములకును, రసోత్తర భక్తి కవితాలతకును నాలంబన మయి యొప్పారుచున్నది గదా! వారి నాటి బృందావన లీలలే నింబార్క, గౌరాంగ, వల్లభాచార్యాదుల మతములకు నంకురము లయ్యెను.

గోపికలు మొట్టమొదట కామదృష్టితో శ్రీకృష్ణుని వలచినను వారికి ధ్యేయమయిన యాతడు మాత్రము విశుద్ధుడు గాన నాయన వారి కామమాలిన్యము కడిగివేసి వారిని ముక్తియోగ్యుల గావించెను. ఏ దృష్టితో ప్రేమించినను ఆ పరమాత్మను చేరనగు ననుట కీ పద్యమే సాక్ష్యము గదా!

**ప ॥ కామోత్కంఠతఁగోపికల్, భయమునన్ గంసుండు, వైరక్రియా**
**సామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్, సంబంధులై వృష్ణులున్,**
**బ్రేమన్ మీరలు, భక్తి నేము నిదెచక్రిం గంటి మెట్లైను ను**
**ద్దామధ్యాన గరిష్ఠుడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!**
**(భాగ-7-18)**

**సూ 22 : తత్రాఽపి నమాహాత్మ్య జ్ఞానవిస్మృ త్యప్రవాదః ॥**

**తా** : గోపికలు కృష్ణుని జారబుద్ధితో కామించి రనుకొన్నను భగవంతుని మాహాత్మ్యాదులను మాత్రము వారు మరచి యుండులేదు.

**వి** : జారులు గాని చోరులు గాని సత్సాంగత్యముచే సాధు స్వభావులే యగుదురును సిద్ధాంత మిందు ప్రదర్శితము. గోపికలు జారబుద్ధితో భగవంతుని భజించిరనుట యర్థవాదము మాత్రమే. అర్థవాదమన్న అతిశయోక్తి కృష్ణుడు. భగవంతుడను జ్ఞానము ముందుగ కలుగనందున వారు వాని భువన మోహన రూపమునే కామించి యుందురు. కాని పరమాత్మతత్త్వ మా గోపికలకు క్రమముగా అవగతమై చివరకు పరాభక్తి రూపము దాల్చియుండు ననుటయు సమంజసమే.

**సూ 23 : తద్విహీనం జారాణా మీవ.**

**తా** : అట్లు కానిచో భగవన్మామాత్మ్యజ్ఞాన శూన్య మయినందున గోపికల ప్రేమ సామాన్య జార స్త్రీల నీచప్రేమవంటిదే యయ్యెడిదిగదా!

**సూ 24 : నాస్త్యేవ తస్మిన్ తత్సుఖసుఖిత్వమ్.**

**తా** : ఆ గోపస్త్రీలకు జారసుఖభావము లేనే లేదు.

**వి** : జారస్త్రీ ప్రేమకు నిలుకడ యుండదు. ప్రియుల సౌఖ్యమాయమకక్కర లేదు. భక్తుని లక్షణము దీనికి పూర్తిగ వ్యతిరేకము. భక్తుడు తన్ను తాను బొత్తుగ మరచిపోయి తన యేకైకలక్ష్యమగు భగవంతుని మంచిచెడుగులనే యరయుచుండును. వానికై యెట్టి కష్టములు పడుటకును వెనుదీయడు. గోపికలు కృష్ణుని సౌఖ్యమును గూర్చియే తమ సర్వస్వము త్యాగము చేసిరను విషయము సర్వవిదితము గదా!

శ్రీ విష్ణుచిత్తులను నామాంతరము గల పెరియాళ్వారులు గరుడ వాహనారూఢు డయిన శ్రీ మహావిష్ణువు తమకు ప్రత్యక్షము కాగానే ఆయన దివ్యమంగళ విగ్రహమునకు దృష్టి యెక్కడ తగులునో యను భయముచే

సర్వజగన్నాథుడగు నాతని పసిపిల్లవానివలె "తిరుప్పల్లాండు" పాశుర (పద్య) ములతో మంగళాశాసనము చేయుట యిట స్మరణీయము–

**ప ॥ హరనీల కోమల శ్యామల దేహ!**
**క్రూరకంస నిసృష్ట ఘోరచాణూర**
**మల్ల నిబర్హణ మహితబలిష్ఠ**
**బాహుయుగళ! నీదు పాదారవింద**
**సౌందర్య సమధిక సంపత్సమృద్ధి**
**....................................**

* * *

# ద్వితీయాధ్యాయము

## (పరాభక్తి మహత్త్వము)

**సూ 25 : సాతు కర్మజ్ఞాన యోగేభ్యోఽ ప్యధికతరా ।**

**తా** : అది కర్మజ్ఞానయోగముల కంటె నధికతరమైనది.

**వి** : మనస్సుకు జ్ఞానము, ఇచ్ఛ, క్రియ అను మూడు శక్తులున్నవి. భగవన్మహిమను జ్ఞానశక్తి గ్రహించును. అతనికి సర్వాత్మ సమర్పణ చేయుటయే ఇచ్ఛాశక్తి ప్రయోజనము. ఆ సమర్పణ సమయమున నింద్రియములు భగవదధీనములై పని చేయుటలో క్రియాశక్తి వ్యక్తమగును. ఈ మూటి కలయిక ఫలితమే పరమానందానుభవము.

కర్మజ్ఞానయోగ మార్గములకంటె పరాభక్తి సర్వజంతు సులభమని పల్కుటచే దాని యాధిక్య ప్రభావములు సువ్యక్తము.

**సూ 26 : ఫలరూపత్వాత్ ।**

**తా** : అది ఫలరూపము గదా మరి.

**వి** : కర్మజ్ఞానయోగ మార్గముల సాధనములు. ఈ మూటికంటె సాధ్యమయిన పరాభక్తి శ్రేష్ఠము.

**సూ 27 : ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వాత్ దైన్యప్రియ త్వాత్ ।**

**తా** : ఈశ్వరుడు గూడ నహంకారవంతుని ద్వేషించి దీనుని ప్రేమించునుగదా!

**వి** : సాధనమందు స్వప్రయత్న మవసరము. స్వయముగా దేనికైన ప్రయత్నించునపుడు తానొక ప్రత్యేక వ్యక్తి నను నహంకారము తప్పదు. అది నశించిననే గాని పరాభక్తి యంకురింపదు. ఇతర మార్గములహంకార మూలములు. కాననే యది యుత్తమ మని నిష్కర్ష.

**సూ 28 : తస్యాః జ్ఞాన మేవ సాధన మిత్యేకే ।**

**తా** : ముక్తికి జ్ఞాన మొక్కటియే సాధనమని కొందరిమతము.

వి : ప్రతివాని యందును అంతఃకరణశక్తి యుండును. అది యనేక రీతులుగా ప్రవర్తించుచుండును. మంచి చెడులను పరామర్శించు దశలో దానిని బుద్ధి యందుము. బుద్ధి నిర్ణయించిన దానిని ఆచరించునది చిత్తము. ఆ అంతశ్శక్తియే ఇతర విధానములు వదలి కేవలము బుద్ధి ప్రధాన మయినపుడు జ్ఞాన మనబడును. ఇది యొక్కటియే మోక్షదాయకమని కొందరి సిద్ధాంతము.

**సూ 29 : అన్యోన్యాశయిత్వ మిత్యన్యే ।**

**తా** : ఈ మార్గములు పరస్పర సాపేక్షము లని కొందరు పలుకుదురు.

**వి** : భక్తి జ్ఞానమార్గము లన్యోన్యాశ్రయము లయినపుడు మాత్రమే ముక్తి కొంగు బంగారమగును.

**సూ 30 : స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః ।**

**తా** : పరాభక్తి స్వయముగా ఫలరూపమని బ్రహ్మకుమారుడగు నారదుని మతము.

**వి** : సాధన సంపత్తిచే నిర్మలమై తన కభిముఖమైన యంతఃకరమును భగవంతుడు స్వయముగా నాకర్షించును. అదే ఈశ్వరుని నిర్హేతుక జాయమాన కటాక్షము. సాధకుని మోక్షేచ్ఛ తీవ్రమైన కొలదియు దైవానుగ్రహము కూడా బలీయమగుచుండును.

**సూ 31 : రాజగృహభోజనాధిషు తదైవ దృష్టత్వాత్ ।**

**తా** : పరాభక్తి స్వయముగనే ఫలరూపమనుటకు రాజు, గృహము, భోజనము అనునవి దృష్టాంతములు.

**వి** : దొంగలచే నపహరింపబడిన రాజకుమారుడొకడు ఎట్లో ఒక సంన్యాసి యాశ్రమము చేరెను. అచట పెరుగుచుండగా నొకనాడతనికి తన జన్మవృత్తాంతము తెలిసెను. అంతవరకు తాను సంన్యాసి ననియే తలచుచుండిన యా బాలునకు తాను రాజపుత్రుడననుమాట జ్ఞప్తికి వచ్చెను.

ఒక గృహస్థుడు తన ఇల్లు వీడి దేశములు తిరిగి తిరిగి తుదకు స్వగృహము చేరుకొనెను. అతని ఇంటిలో నెట్టి మార్పును రాలేదు. కాని దేశసంచారముచే నతనిలో చాలా మార్పులు సంభవించెను. ఇల్లు చేరిన వెంటనే ఆ యింటిలో తాను పడిన సుఖదుఃఖములు వాని కనుభవమునకు రాసాగెను.

ఆకలి గొన్నవాడు భుజించినపుడు తాత్కాలికమగు ఆకలిబాధ మాత్రము తొలగుచున్నది. కాని క్రొత్తగా వానికి కలుగు తృప్తి కానరాదు.

విఘ్నములను మాత్రమే సాధన సంపద తొలగించునని, లేని దానిని అది తెచ్చి పెట్టలేదని పై దృష్టాంతములచే తెలియునట్లే పరాభక్తి యాత్మకు నైజగుణమని తెలియవలెను.

**సూ 32 : న తేన రాజా, పరితోషః, క్షుత్ శాంతి ర్వా ।**

**తా** : పై కారణములచే ఆ బాలుడు రాజు కాలేదు. ఆ గేస్తుకు సంతసము కలుగలేదు. ఆకలిగొన్న వాని కాకలి తీరలేదు.

**వి** : సంన్యాసివి కాదని కొందరన్నందున బాలుడు క్రొత్తగా రాజపుత్రుడు కాలేదు. గేస్తుడును క్రొత్త సంతోషము నొందలేదు. క్షుధార్తునిలో గూడ క్రొత్త మార్పు రాలేదు. యోగాది సాధనములు గూడ నిట్టివే.

**సూ 33 : తస్మాత్ సైవ గ్రాహ్యా ముముక్షుభిః ।**

**తా** : కాన ముముక్షువులు పరాభక్తినే గ్రహింపనగును.

**వి** : పరిపూర్ణాత్మానుభూతియే పరాభక్తి. అదియే మోక్షము. కాన బ్రహ్మచింతనము సేయువాడు ఆ భక్తికి మించిన ప్రాప్యము వేరొకటి లేదని గ్రహింపవలెను.

* * *

# తృతీయాధ్యాయము

## (భక్తి సాధనములు)

**సూ 34 : తస్యాః సాధనాని గాయం త్యాచార్యాః**

**తా** : పరాభక్తి సాధనముల ననేకరీతులుగా నాచార్యులు కీర్తించిరి.

**శ్లో ॥ ఆచినోతి హి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి ।**
**స్వయ మాచరతే యస్మా త్తస్మా దాచార్య ఉచ్యతే ॥**

**వి** : (పలురీతులగు శాస్త్రార్థములను సంగ్రహించి శిష్యులకు బోధించును. అంతేగాదు. తాను గూడ నాచరించు వాడగుట చేత మాత్రమే యతడాచార్యుడగును)

ఇట్టి స్వానుభవపూర్ణులగు పూర్వాచార్యులు లోకానుగ్రహము నుద్దేశించి తమ యనుభవములను ప్రచారము చేసిరి. అట్టి బోధగురువుల సూక్తులే విశ్వసనీయములు. కాని దంభాచారులవి మాత్రము కావు.

**సూ 35 : తత్తు విషయ త్యాగాత్ సంగత్యాగా చ్చ ।**

**తా** : విషయములను, సంగమును త్యజించుటచే పరాభక్తి యుదయించును.

**వి** : యాదృచ్ఛికముగా నెదురైన విషయములను మమకార రహితముగా ననుభవించుటయే విషయ త్యాగము. వస్తువు ననుభవించుచు గూడ దానిపై కోరికను మానసికముగా త్యజించుటయే సంగత్యాగము. విషయములను బాహ్యముగా త్యజించుట ముఖ్యమని సారాంశము.

**సూ 36 : అవ్యావృత్త భజనాత్ ।**

**తా** : అవ్యావృత్తమైన పద్ధతిలో భజించుట చేత మాత్రమే భగవల్లబ్ధి అగును.

**వి** : ముముక్షువు నిషిద్ధములను వదలి యనుకూలములను శ్రద్ధగా నాచరింపవలెను. అప్పుడే పరాభక్తి లభించును.

ఆత్మకు సకల కల్యాణ గుణములు సహజములు. ఆ గుణములను గానాదులతో నెవరువేసికొనుచుండుటయే భజనము. భగవత్ప్రేమపూర్వకముగా చేయు పనియంతయు భజనమే. దీనికి విఘ్నములు కూడ బహుళముగా సంభవించుచునే యుండును.

భజన మన్నను భక్తి యన్నను ఒకటే. అట్టి భక్తి నవవిధములని ప్రహ్లాదుడు ప్రవచించెను గదా.

**ప ॥ తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్ చింతనం, బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!**

**(భాగవతము)**

ఈ నవవిధ భక్తులను త్రికరణశుద్ధిగా ఆచరించినపుడే యది ఫలప్రదమగుట యని వేరుగా చెప్పనక్కరలేదు గదా! పై పద్యములోని, తను హృద్భాషలన్, అను పదము దీనినే నొక్కి పలుకుచున్నది.

**సూ 37 : లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్ ।**

**తా** : సంసారమం దుండి గూడ భగవద్గుణ శ్రవణ కీర్తనాదులు చేయనగును.

**వి** : సాధనకాయికము, మానసికము అని రెండు తెఱగులు. శరీరము. లౌకిక కార్యములందు లగ్నమైనను మానసికముగా భగవంతుని కల్యాణ గుణగణములను చెవులార వినుటలోను, నోరార కీర్తించుటలోను నిబ్బంది యుండదు. కాయిక సాధన

శూన్యమయినను నీ మానసిక సాధనమే మానవునకు సిద్ధి కలిగించును.

మనస్సు సదా యొక విషయమును చింతించుచునే యుండును. దానికి శూన్యస్థితి యుండదు. కాన శరీరముచే ఇతర కార్యములు చేయుచున్నను మనస్సును మాత్రము భగవంతుని యందే లగ్నము చేయవలెను. సాధన చేసిన కొలదియు నీ పద్ధతి సులభమగును.

శ్రీ రామకృష్ణ పరమహంస గృహకృత్యములు చేసికొనుచు కూడ భగవన్నామస్మరణ చేయువారికి భుక్తిముక్తులు కర బదర సదృశ (చేతిలోని రేగుపండు) పని యానతిచ్చినారు గదా!

**శ్లో ॥ "వచసా త జ్జపే న్నిత్యం వపుషా తత్సమభ్యసేత్ ।**
**మనసా త జ్జపే న్నిత్యం త త్పరంజ్యోతి రోమితి ॥"**

**శ్లో ॥ శుచిర్వాప్యశుచి ర్వాపియోజపేత్ ప్రణవం సదా ।**
**నసలిప్యతి పాపేన పద్మపత్ర మివాంభసా ॥"**

వాక్కుతో మంత్రజపము చేయుచు శరీరముతో దానినే యభ్యసింపవలెను. ఓంకారరూపమగు నా పరంజ్యోతిని మనస్సులో నిత్యమును జపింపవలెను. శుచియై గాని యశుచియై గాని ప్రణవజపమెల్లప్పుడును చేయవలెను. జలబిందువు తామరాకు నంటనట్లు పాప మాతనిని తాకనైన తాకదు.

భగవంతుడను పదముయొక్క యర్థము వ్యాపకము.

**శ్లో ॥ "జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజాం స్యశేషతః ।**
**భగవచ్ఛబ్ద వాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః ॥**

(జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అనుగుణములు భగవంతుని యందు పుష్కలముగా నెలకొని యుండును. అతడు హేయగుణ

రహితుడు. అట్టివాని దివ్యమంగళ విగ్రహ జపమే జపము! తత్కల్యాణగుణ స్మరణమే తపము!!)

**సూ 38 : ముఖ్యతస్తు మహత్కృయైవ భగవత్కృపా లేశాద్వా ।**

**తా** : ఈ సిద్ధి మహాత్ముల కృపచేత గాని భగవత్కృపాలేశము చేత గాని కలుగునది మాత్రమే.

**వి** : 'పురుష ప్రయత్నము లేనిదే భక్తి యబ్బ'దని పైన చెప్పిరి గదా. ఇపుడిట్లు చెప్పనేల యని కొందరనవచ్చును. ఆ భగవత్కృప గాని, భగవత్ కటాక్షము గాని కలుగనిదే పురుషకారము ఫలింపదు సుడీ! చెట్టు నెక్కువాని కెవరైన చేయి నందించినచో పైకి పోవుట యెంత సులభమో యది కూడ నంతే. భగవదనుగ్రహము పురుషకారమునకు తోడైనపుడే ముక్తి సాధ్యమనుట నిర్వివాదము.

భగవదనుగ్రహము గురూపదేశరూపమై యుండును. గురువు తల్లివంటివాడు. కాననే గురువు ఎంత పాపియొక్క మాలిన్యము నైనను కప్పిపుచ్చును; కడిగివేయును. వాని మంచినే భగవంతుని యెదుట నుంచి రక్షింపజేయును.

**శ్లో ॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీగురవేనమః ॥**

(గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు. వేయేల త్రిమూర్తులను సృష్టించిన పరబ్రహ్మ గూడ గురువే. అట్టి గురువుకు నమస్కారము)

**శ్లో ॥ "గు" శబ్ద స్త్వంధకారస్స్యా "ద్రు" శబ్ద స్త న్నిరోధకః ।**
**అంధకార నిరోధిత్వా ద్గురు రిత్యభిధీయతే ॥**

('గు' అనుపదముచే అంధకారము 'రు' అనుపదముచే దాని నిరోధము సూచింపబడును. అజ్ఞానాంధకారము మది నంటనీయని వాడే గురువు).

**శ్లో ॥ "అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥"**

(అజ్ఞానాంధకారముతో కన్నుగానని వారికి జ్ఞానాంజన ప్రయోగము చేసి నేత్రోన్మీలనము చేయునట్టి గురువునకు నమస్కారము)

ఇట్టి సద్గురువు నాశ్రయించిన వాడే మోక్షార్హుడు.

**సూ 39 : మహత్సంగ స్తుదుర్లభోఽ గమ్యోఽ మోఘశ్చ ।**

**తా** : మహాత్ముల సాంగత్యము దుర్లభము, అగమ్యము, అమోఘము.

**శ్లో ॥ "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యత తి సిద్ధయే ।**
**యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥**
**(గీత 7-3)**

(సహస్ర సంఖ్యాకులగు మానవులలో నొక్కడు ముక్తికై ప్రాకులాడును. వారిలో లక్షకొకడు మాత్రమే నాతత్త్వము నెరుగగలడు)

– అన్నట్లు ప్రయత్నించిన వారందరికిని మోక్ష మబ్బదు. అట్టి స్థితిలో–

**ప ॥ "నిక్కమైన మంచి నీల మొక్కటి సాలు,**
**తళుకు బెళుకు రాలు తట్టె డేల?"**

– అని వేమన వచించినట్లు విశుద్ధజ్ఞాని యగు గురువు లభించుటయే దుర్ఘటము.

సమబుద్ధి గలవాడే మహాత్ముడు. ఎట్టివాడతడు.

**శ్లో ॥ "సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥" (గీత 6-9)**

(మిత్రుడు, శత్రుడు, మధ్యస్థుడు, ద్వేష్యుడు అను భావము తటస్థున కుండదు. సాధువులను, పాపులను గూడనాతడు సమబుద్ధితోనే చూచును.)

**సూ 40 : లభ్యతేఽపి తత్కృపయైవ ॥**

**తా** : భగవత్కృపచే నది లభ్యము.

**వి** : అత్యంత దుర్లభమగు మహాత్ముల సాంగత్యము భగవత్కృప కలిగిన వాడికి సులభమే యగును.

మహాత్ము లయాచితముగవచ్చి పరమపాపికి గూడ సదుపదేశము లిచ్చి పోవుచుందురనుట యరుదే యైనను జరుగుచునే యుండును. దైవ కృప గురుశిష్యుల నొకచో కూర్చును. శిష్యుని పుణ్యము పరిపక్వమై నపుడిది జరుగును.

కబీరుకు రామానందుల వలన రామమంత్రము లభించిన తీరిట్టిదే కదా! కబీరుదాసు కాశీలో చీకటిలో గంగమెట్లపై పరుండి మంత్రమును తన కెవరుపదేశింతురా యని యెదురు చూచుచుండెనట. సద్గురువు రామానందుడు స్నానార్థమై యటకు వచ్చి చీకటిలో నాతని త్రొక్కెనట. ఏదో తన కాలికి తగులుటచే నొచ్చుకొని 'రామ్-రామ్' అని ఆ గురువు పల్కెనట. కబీరు దానినే గురువు చేసిన మంత్రోపదేశముగా భావించెనట. తదాది కబీరు కూడ గురువంతటి జ్ఞానవంతుడగుటయే గాక మహాకవి గూడ యయ్యెనట.

**సూ 41 : తస్మిం స్తజ్జనే భేదా భావాత్ ।**

**తా** : భగవంతునకును భక్తునకును భేదము లేదుగదా!

**వి** : భగవంతుని కరుణ నిర్హేతుకము. అది సర్వులపై సమముగా ప్రసరించును. మానవుని యహంకారాదులు నడుమ నడ్డుపడును. వానిని గూడ తొలగించి భగవంతుడు తన దయ నందరకును సమముగా నందించును.

**సూ 42 : తదేవ సాధ్యతమ్, తదేవ సాధ్యతామ్ ।**

**తా** : దానినే సాధింపవలెను, దానినే సాధింపనగును.

**వి** : భగవంతునిపై ప్రేమ యంచలంచలములుగా నుండుట కుపకరించు సాధనములను అలవఱుచుకొనవలెను. నడుమ వచ్చు విఘ్నములు కర్మాధీనములు. వానిని గూడా ఆత్మసమర్పణముచే తొలగించు కొననగును. ఆత్మసమర్పణము పరాభక్తిచే సాధ్యము. భగవత్తత్వము బోధపడిననాడే ఆ భక్తి దృఢమగును. అహంకార మమకారములను విసర్జించి నీవే శరణమని భగవంతుని పాదములను నమ్మి యుండుటయే ఆత్మసమర్పణము.

అది ఈ క్రింది శ్లోకమున వివరింపబడినది–

**శ్లో ॥ "సకృ దేవ ప్రపన్నాయ తవాఽ స్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్రతం మమ ॥"**
**(శ్రీమద్రామాయణము)**

(ఒక్కసారి నేను నీవాడనని శరణుజొచ్చినవా డెట్టి దుష్టుడైనను సరే వాని కభయ మిచ్చుటయే నా వ్రతము) అని శ్రీరామచంద్రుడు విభీషణునితో పల్కిన మాట యిట స్మరణీయము.

**సూ 43 : దుస్సంగ స్సర్వథైవ త్యాజ్యః ।**

**తా** : దుస్సంగమెల్ల రీతులుగ త్యాజ్యము.

**వి** : భగవంతుడు సర్వాంతర్యామి యైనపుడు దుష్టులను త్యజించుట యన్నవారిలో గల భగవంతుని త్యజించుటే యగును గదా, అదెట్లు పొసగు ననరాదు. సాధనావస్థయందు దుర్గుణములకు దూరముగ నుండక తప్పదు.

**ప ॥ "మనవతీ కటాక్ష శిత మార్గణముల్ విదళింపజాల వె**
**వ్వాని మనంబు; క్రోధమయవహ్నిఁగఱంగఁడు; లోభపాశ సం**
**తానము మాల్యచందన వితానములున్ వెత సేయునోపవె**
**వ్వాని వశంబునన్ మెలఁగు; వాఁడ జయించు జగంబు లన్నియున్"**

**సూ 44 : కామక్రోధ మోహస్మృతి భ్రంశ బుద్ధినాశ కారణత్వాత్ ।**

**తా** : దుస్సంగము కామ క్రోధ లోభములను ప్రకోపింపజేయును. భగవత్స్మరణను నశింపజేయును. సద్బుద్ధిని పోగొట్టును.

**వి** : దుస్సాంగత్యము చేయుపను లిందు వివరింపబడినవి. భగవంతుని స్మరణకు దూరము చేసి మంచిబుద్ధిని విరచి వేయునట్టి దుస్సాంగత్య మవశ్య వర్జనీయము.

**సూ 45 : తరంగాయితా అపీమే సంగాత్సముద్రాయంతి.**

**తా** : కామదులు ప్రప్రథమమున సముద్రమునందలి అలలవలె అల్పముగ నుద్భవించినను క్రమక్రమముగా సాగరము వలెనే విస్తరించును.

**వి** : కామాదు లంకురించినవని తెలియగనే బుద్ధిమంతుడు వానిని గోటితో గిల్లివేయనగును. దుస్సాంగత్యముచే నవి గోరంతలు కొండంతలుగా పెరిగిన తర్వాత వాని నరికట్టుట దుస్సాధ్యము. కాన సాధకుడు అట్టివాని నంకురావస్థలోనే నిర్మూలింపవలెను.

ఒక యాలయముపై మొలచిన మఱ్ఱియొక్క నుపేక్షించినచో నది పెరిగి తన కాశ్రయమయిన యా మందిరమునే నాశము చేయును గదా! ఇట్టివే కామాదులును.

**సూ 46 : క స్తరతి క సర్తతి మాయాం! యః సంగం ।**
**త్యజతి యో మహానుభావం సేవతే నిర్మమో భవతి ॥**

**తా** : ఎవడు సంగము త్యజించునో, మహానుభావుని సేవించునో, మమకార రహితుడగునో అట్టివాడు మాత్రవే మాయాసముద్రము తరింపగలడు.

**వి** : సాధకుడు సద్గు రూపదేశానుసారము భక్తి నభ్యాసము చేసినపుడే గమ్యము సులభమగును.

**సూ 47 : యో వివిక్తస్థానం సేవతే, యో లోకబంధ మున్మూలయతి ।**
**(యో) నిస్త్రైగుణ్యో భవతి (యో) యోగక్షేమం త్యజతి ॥**

**తా** : ఏకాంతవాసము, లోకబంధచ్ఛేదము, త్రిగుణాతీతత, తన యోగ క్షేమభారము తాను వహింపకుండుట ఇవి విరాగిలక్షణములు.

**వి** : ఇట్టి విరాగియొక్క యోగక్షేమములు తానే వహింతునని భగవానుడు గీతలో వివరించెను గదా!

**శ్లో ॥ "అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"**
**(గీత 9-22)**

**సూ 48 : యఃకర్మఫలం త్యజతి, కర్మాణి సంన్యస్యతి, తతోనిర్ద్వంద్వో భవతి।**

**తా** : కర్మఫలమును వదలుటతో పాటు స్వార్థపరమైన కర్మలను వదలినవాడు మాత్రమే సుఖదుఃఖాది ద్వంద్వములకు దూరముగా నుండగలడు.

**వి** : ప్రాణిమాత్రుడైనవాడు కర్మ చేయనిదే జీవింపలేడు. ఏదో యొక పని ఉద్దేశసహితముగనో, రహితముగనో చేయుచునే యుండును. జ్ఞాని ఇది యెరిగి కర్మఫలము కృష్ణార్పణము చేయును. కర్మఫలత్యాగియే త్యాగి. దీనినే గీత ఇట్లు వాకొన్నది-

**సూ 49 : యోవేదా నపి సంన్యస్యతి కేవల మవిచ్ఛిన్నామ రాగం లభతే ।**

**తా** : వేద విహితకర్మలను గూడ సంన్యసించినవాడు మాత్రమే భగవంతుని యవిచ్ఛిన్నప్రేమకు పాత్రుడు కాగలుగును.

**వి** : అవిచ్ఛిన్నప్రేమయే ముఖ్యభక్తి. దానికి పరాభక్తి దారితీయును.

**సూ 50 : స తరతి స తరతి స లోకాంస్తారయతి ।**

**తా** : అట్టి పరాభక్తుడు మాత్రమే తాను తరించుటతోపాటు సర్వ లోకములను తరింపజేయు సమర్థుడు.

* * *

# చతుర్థాధ్యాయము

**(భక్తి లక్షణము)**

**సూ 51 : అనిర్వచనీయం ప్రేమ స్వరూపమ్ ।**

**తా** : ప్రేమ స్వరూప మనిర్వచనీయము.

**వి** : భక్తి ద్వివిధము. గౌణభక్తి, ముఖ్యభక్తి యని. భగవద్గుణ గణాకర్ణనముచే ప్రాప్తించుని గౌణభక్తి. అదే పరాభక్తి. దీని తర్వాతి మెట్టు ముఖ్యభక్తి. అది కేవల భగవత్సేవారూపము. సమస్త సాధనములకును నా ముఖ్యభక్తియే ఫలము. ఈ సూత్రమందలి ప్రేమపదము భక్తికి కడపటి దశయగు ముఖ్యభక్తిని సూచించును.

**సూ 52 : మూకాస్వాదనవత్ ।**

**తా** : మూగవానికి రుచి తెలియునట్లు.

**వి** : సామాన్యునివలెనే మూగవానికి గూడ రుచి తెలియును. కాని యది వాడు వాక్కుతో తెలియజేయలేడు. చెప్పలేనంత మాత్రమున వానికి రుచి తెలియదని యన వీలు లేదు గదా!

**సూ 53 : ప్రకాశ్యతే క్వాఽపిపాత్రే ।**

**తా** : ఆ ప్రేమ యోగ్యుని విషయమున మాత్రమే ప్రకాశించును.

**వి** : నారదమహర్షి భక్తి జ్ఞానతత్త్వములను సంపూర్ణముగా కాచివడపోసినవాడు. అట్టివాడు కూడా భక్తి యిట్టిదని వర్ణించుట పొసగదని పలుకగా ఇతరులమాట చెప్పనేల?

**సూ 54 : గుణరహితం, కామనారహితం, ప్రతిక్షణ వర్ధమానం, అవిచ్ఛిన్నం, సూక్ష్మతరం అనుభవరూపమ్ ।**

**తా** : అది గుణశూన్యము. కామనా విరహితము. అనుక్షణము వృద్ధి చెందునది. అవిచ్ఛిన్నమై అతి సూక్ష్మమై యుండును. అనుభవమే దాని రూపము.

**వి** : గుణములే లేనిదానిని వర్ణించుట ఎట్లు? కాననే ఇది యనిర్వచనీయము. భగవత్ప్రేమ కోరిక కాదు. ఈ ప్రేమానుభూతి ఏకరూపము, ఎడతెగనిది. సర్వేంద్రియములను ఈ యనుభూతి సమయమున భగవదేకముఖమ్మైయుండును. ఇది అంతః కరణమునకు సంబంధించినది. అగోచరమైన దీని నితరుల కెట్లు తెలియజెప్పుట స్థూలమున వర్ణింపనగును గాని సూక్ష్మము నెట్టు వర్ణించుట; అది యెట్టి యితర భావముల సహాయమును ఆశింపక తనంతట తానే వృద్ధి చెందుచుండును.

**సూ 55 : తత్ప్రాప్య తదేవావలోకయతి, దేవ శ్రుణోతి, తదేవ భాషయతి, తదేవ చింతయతి ।**

**తా** : భక్తియొక్క ఈ పరాకాష్ఠనందుకొన్నవాడు సర్వమును భగవత్స్వరూపముగా తలచి యన్నిటను భగవంతునే చూచును. సమస్తమును ప్రేమించును. జీవలోక సేవయే భగవత్సేవగా భావించును. భక్తలోక మూర్ధన్యుడగు ప్రహ్లాదకుమారు నిట్టివానిగనే పోతనార్యుడు వర్ణించుట గమనార్హము –

**శ్లో ॥ తనయందు నఖిల భూతములందు నొక భంగి**
**సమహితత్వంబున జరుగువాఁడు!**
**పెద్దలఁబొడఁగన్న భృత్యుని కైవడిఁ**
**జేరి నమస్కృతుల్ సేయువాఁడు!**
**కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన**
**మాతృబావము సేసి మఱలువాఁడు!**

**తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను**
**దీనులఁగావఁ జింతించువాఁడు,**
**సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు,**
**దైవతము లంచు గురువులఁదలఁచువాఁడు,**
**లీలలందును బొంకులు లేనివాఁడు,**
**లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁడధిప । (ప్రహ్లాద చరిత్ర 7-115)**

భక్తి పరాకాష్ఠ నందిన వానికి -

**సూక్తము: "యచ్చకించి జ్జగ త్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపివా ।**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥"**

(ఈ దృశ్య ప్రపంచమున ఏది కనబడుచున్నదో, వినబడుచున్నదో దాని బాహ్యాభ్యంతరములందంతటను శ్రీమన్నారాయణుడు నిండియున్నాడు). ఇట్టివాని యావజ్జీవికయును నొక మహాభక్తి యజ్ఞమే.

గీతగూడ దీనినే ధ్రువపరచెను గదా!

**శ్లో ॥ "యోమాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి ॥" (గీత 6-30)**

(ఎవడైతే సర్వమున నన్నే చూచి సర్వమును నాయందే చూచునో అట్టివానిని నేను నశింపను. నాకును వాడు నశింపడు).

**సూ 56 : గౌణీ త్రిథా గుణభేదా దార్తాదిభేదా ద్వా ।**

**తా** : సత్వ రజస్తమో గుణములను బట్టియును - ఆర్తిత్వము, జిజ్ఞాసుత్వము, అర్థార్థిత్వము అను భేదములను బట్టియును గౌణభక్తి త్రివిధము.

**వి** : గుణసంబంధియే గౌణమని చెప్పబడినది గదా!

మనస్సు నానా వాసనలకును నెలవు. కాన సాధకుని భక్తియు మొదట వాసనలతోనే కలసి పెరుగును. ఆ వాసనలు

త్రిగుణములను బట్టియే నడచును. కాన భక్తి గూడ త్రిగుణాత్మకమైనందున గౌణభక్తి యనబడును. ఇదియే క్రమశః ముఖ్యభక్తిగా రూపొందును. ముఖ్యభక్తియే తైలధారవలె నవిచ్ఛిన్నముగా భగవంతుని వైపుకు సదా ప్రవహించుచుండును.

రెండవ తెగకు గౌణభక్తి గూడ సంకల్పభేదమును బట్టి త్రివిధము – ఆర్తిత్వము, అర్థార్థిత్వము, జిజ్ఞాసుత్వము అని.

క్లేశము నుండి బయట పడగోరువాడు ఆర్తుడు. ప్రమాదములు దాటదలపుగలవాడు జిజ్ఞాసువు. పాపపరిహారమును కాంక్షించు వా డర్థార్థి. భక్తుడివి యన్నియు లోకకల్యాణార్థమే కోరుకొనును.

వీరందరిలో జ్ఞాని సర్వోత్కృష్టుడు –

**శ్లో ॥ "తేషాం జ్ఞాని నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే ।**
**ప్రియో హిజ్ఞాని నోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥**
**(గీత 7-17)**

(పై జెప్పినవారిలో జ్ఞానిస్థానము విశిష్టము. జ్ఞాని నా కత్యంత ప్రియుడు. నేను వానికి ప్రియుడును)

**సూ 57 : ఉత్తరస్మా దుత్తరస్మాత్ పూర్వా పూర్వా శ్రేయాయ భవతి ।**

**తా** : తామసభక్తి కంటె రాజసభక్తి; దానికంటె సాత్వికభక్తి యుత్తమము. అట్లే అర్థార్థిభక్తికంటె జిజ్ఞాసువు భక్తియు; దానికంటె ఆర్తునిభక్తియు శ్రేష్ఠతరములు.

**వి** : సాత్త్వికభక్తి ముఖ్యభక్తికి చేరువైనది.

**సూ 58 : అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ ।**

**తా** : పరాభక్తికన్న ముఖ్యభక్తి సులభముగా కనిపెట్టదగినది.

వి : అన్యవస్తువులను వీడి భగవంతుని చేరిన ప్రేమనే గదా భక్తి యందుము. కాన దానిని కనిపెట్టనగును.

**సూ 59 : ప్రమాణాంతరస్యానపేక్షత్వాత్, స్వయం ప్రమాణత్వాత్ ।**

తా : భక్తి నెరుగుటకు నితర ప్రమాణము లనవసరము. దాని కదియే ప్రాణము.

**సూ 60 : శాంతి రూపాత్ పరమానందరూపా చ్చ ।**

తా : శాంతి, యానందము ఆ భక్తికి రూపములు.

వి : భక్తుడు లోకశాంతిని గూర్చి, ఆనందమును గూర్చి సదా ప్రయత్నించుచుండును. స్వార్థప్రేరితుడు గాక సదా పరార్థ పరమార్థములకే యాతడు పాటుపడుచుండును. కాన లోకదుఃఖాదు లాతని కంటవు. కాన భగవద్భక్తి అతనికి అమేయ శాంతిని, ఆనందమును ఇచ్చును.

**సూ 61 : లోకహానౌ చింతా న కార్యా; నివేదితాత్మలోక వేద (శీల) త్వాత్।**

తా : లోకదుఃఖమును గూర్చి భక్తుడు చింతింపడు. లోకమును అతడు భగవంతునికే సమర్పించును గదా!

వి : కర్మఫలము వదలి పని చేయును గాన నాతనికి సుఖదుఃఖము లంటవు.

**సూ 62 : న తత్సిద్ధౌలోకవ్యవహారో హేయః; కింతు ఫలత్యాగః తత్సాధనంచ (కార్యమేవ)**

తా : భక్తి సిద్ధించేటకు ముందుగాని తర్వాతగాని భక్తుడు లోకవ్యవహార విముఖుడు కానక్కరలేదు. శుభకర్మాచరణము తత్ఫలము భగవదర్పణ చేసిన చాలును.

